ప్రథమహోరయందు ప్రశ్న జేసెనేని సూర్యుఁడు ఉత్తరాయణమగు మకరాదిషట్క మందుండఁగా జననమనియు, ద్వితీయహోరయందు ప్రశ్న జేసెనేని దక్షిణాయనమగు కర్కటాదిషట్కమందుండఁగా జననమనియు తెలియతగినదని భావము.

ఋతుర్ద్రేష్కాణపైర్వాచ్యో ద్రేక్కాణాంశే లగ్నసంస్థైపివా గ్రహైః,
అయనస్య విలోమేతు పరివర్తః పరస్పరమ్. 2

గ్రహయోనిభేదాధ్యాయమందు శ్లో. ౧౭ "శిశిరాదీనా మీశా శ్శనిసితభౌమేందుబుధజీవాః." అని చెప్పఁబడియున్నదిగాన ప్రశ్నలగ్నమందు శనియున్నను శనిద్రేక్కాణమైనను శిశిరఋతువునందు జననమనియు ప్రశ్నలగ్నమందు శుక్రుఁడున్నను శుక్రద్రేక్కాణమైనను వసంతఋతువునందనియు, ప్రశ్నలగ్నమందు కుజుఁడున్నను కుజద్రేక్కాణమైనను గ్రీష్మఋతువునందనియు, ప్రశ్నలగ్నమందు చంద్రుఁడున్నను చంద్రద్రేక్కాణమైనను వర్షఋతువనియు, ప్రశ్నలగ్నమందుఁ బుధుఁడున్నను బుధద్రేక్కాణమైనను శరదృతువనియు, ప్రశ్నలగ్నమందు గురుఁడున్నను గురుద్రేక్కాణమైనను హేమంతఋతువనియు జననము తెలియతగినది. లగ్నమం దనేకులుండిరేని బలాధికముచే తెలియతగినది. గ్రహశూన్యమాయెనేని ద్రేక్కాణము ననుసరించియే తెలియతగినదని భావము. ఇట్లు ఋతునిర్ణయము జేయఁగా అయనవ్యత్యయము గలిగెనేని జెప్పఁబోవురీతిని నిర్ణయించతగినదని భావము.

శశిజ్ఞగురుభి స్సార్ధం సితలోహితసూర్యజైః,
ద్రేక్కాణేఽర్ధే భవేత్పూర్వో మాసఃపూర్వః పరేపరః. 3

అయనవ్యత్యయము గలుగుచుండఁగా శుక్రఋతువయ్యెనేని చంద్రఋతువనియు, కుజఋతువయ్యెనేని బుధఋతువనియు, శనిఋతువయ్యెనేని గురుఋతువనియు దెలియతగినది. అనఁగా ఉత్తరాయణమందు వర్షఋతువని తెలిసెనేని వసంతఋతువందు జననమనియు, దక్షిణాయనమందు వసంతఋతువని దెలిసెనేని వర్షఋతువందు జననమనియు, ఉత్తరాయణమందు హేమంతఋతువని దెలిసెనేని శిశిరమందు జననమనియు, దక్షిణాయనమందు శిశిరమని దెలిసెనేని హేమంతమందు జననమనియు, ఉత్తరాయణమందు శరదృతువని దెలిసెనేని గ్రీష్మర్తువందు జననమనియు, దక్షిణాయనమందు గ్రీష్మఋతువని దెలిసెనేని శరదృతువునందు జననమనియుఁ జెప్పతగినది. మాసము దెలియుక్రమం బెట్లనిన: ప్రశ్నలగ్నముయొక్క ద్రేక్కాణభాగలు ౧౦ టి లో మొదటి ౫ భాగలయందు ప్రశ్న జేసెనేని వచ్చిన ఋతువులో మొదటిమాస

మనియుం బ్రశ్నలగ్నద్రేక్కాణభాగలు ౧౦ టిలో ఉత్తరార్ధమందున్న ౫ భాగల యందు బ్రశ్న జేసెనేని వచ్చిన ఋతువులో రెండవమాసమనియుఁ దెలియతగినది.

అనుపాతాత్తిథిః కల్ప్యా కేచిదాహురినాంశజాం,
లగ్నభాగైర్ద్విరభ్యస్తైః పంచభిర్లభ్యతే గురుః. 4

ద్రేక్కాణమునకు ౬౦౦ లిప్తలు. అద్రేక్కాణార్ధమైన ౩౦౦ల లిప్తలచేత మాసం బేర్పడును. గనుక పదేసిలిప్తల కొక్కొక్కతిథిప్రకారముగా అద్రేక్కాణమం దెన్నిలిప్తలు జెల్లినవో దెలుసుకొని తిథినిర్ణయము జేయతగినది. కొందఱు ప్రశ్నకాలమున సూర్యుఁడున్నరాశియందు ఎన్నిభాగలు భుక్తములైయుండునో అన్నితిథులు జ్ఞాతమాసమందు శుక్లప్రతిపదాదిగా గతించినవని యెఱింగి తత్కాలమాసమందు సూర్యుఁడెన్నవభాగయందుండునో ఆన్నవతిథియందు జననమనియుఁ జెప్పతగినదని జెప్పుదురు. ప్రశ్నలగ్నమం దెన్నిభాగలు భుక్తములగునో ఆభాగలను ౨ చే గుణించి ౫ చే భాగించఁగా లబ్ధము ప్రశ్నలగ్నము మొదలు గురుఁడున్నరాశి యని తెలియతగినది. అనఁగా రాశికి ముప్పదిభాగలుగాన రెండున్నరభాగ కొక్కొక్కరాశియందు గురుఁ డుండునని భావము.

వయోనుమానాద్వర్షాణి ద్వాదశద్వాదశక్షిపేత్,
ద్యురాత్రినామధేయేషు విలోమాజ్జన్మసంభవః. 5

నష్టజాతకప్రశ్న జేసినవాని ఆకారమును జూచి వీనికి ఇన్నిసంవత్సరముల వయస్సుండునను ఊహవల్ల సంవత్సరములను కల్పించి చెప్పవలయును. ఎట్లనిన: బృహస్పతి ౧౨ సంవత్సరముల కొక్కమారు ద్వాదశరాశిసంచారము సేయును. గనుక పూర్వోక్తప్రకారముగా జన్మకాలమున గురువున్నరాశి నెఱింగి వర్తమానమగు ఈసంవత్సరమున ఈరాశియందుండెనుగదా రమారమిగా ఇన్ని గురు భగణములును గతించియుండవచ్చునని దెలిసికొని తదుపరి వీనిజననం బీసంవత్సరమందని నిశ్చయించి చెప్పతగినది. దివారాత్రులు దెలియుక్రమం బెట్లనిన: రాత్రిసంజ్ఞలైన మేషవృషభమిథున కర్కటక ధనుర్మకరములలో నొకటి ప్రశ్నలగ్నం బాయెనేని పగలు జననమనియుం, దివాసంజ్ఞలైన సింహకన్యాతులావృశ్చికకుంభమీనములలో నొకటి ప్రశ్నలగ్నంబాయెనేని రాత్రి జననమనియుం తెలియతగినది.

లగ్నభాగైః క్రమేణైవ వేలామృగ్యాఽనుపాతతః,
లగ్నత్రికోణరాశీనాం యో బలీ జన్మకృద్భవేత్. 6

ప్రశ్నకాలమున లగ్నగతలిప్తలను తెలుసుకొని ఆలిప్తలను రాత్రియందు జనన మాయెనేని దివాప్రమాణముచే గుణించి రాత్రిప్రమాణముచే భాగించఁగా రాత్రి జననఘటికలేర్పడును. పగటియందు జననమాయెనేని ఆలిప్తలను రాత్రిప్రమాణముచే గుణించి దివాప్రమాణముచే భాగించఁగా పగటియందైన జననకాలఘటిక లేర్పడును. లగ్నపంచమనవమములలో నేరాశి ఉత్తమబలయుక్తమై యుండునో ఆరాశియందు చంద్రుఁడుండఁగాఁ బుట్టెనని చెప్పతగినది.

శీర్షాదిసంస్పృశేత్ స్పృష్టా పృచ్ఛత్తద్రాశిమాదిశేత్,
యావద్గతశ్శశీ లగ్నాచ్చంద్రా త్తావతి జన్మభమ్. 7

పూర్వమందు చెప్పఁబడియున్న కాలపురుషుని అంగములలో నేరాశి యుండెడు అంగమును పృచ్ఛకుఁడు స్పృశించునో ఆరాశియందు చంద్రుఁడుండఁగాఁ బుట్టెనని యైనను జెప్పవచ్చును. చంద్రుఁడు ప్రశ్నలగ్నము మొదలు ఎన్నవరాశియందుండునో చంద్రుఁడున్న రాశి మొదలు అన్నవరాశియందు జన్మమని తెలియతగినది.

మీనోదయే వదే న్మీనం లగ్నాంశసదృశోదయం,
లగ్నాద్భానుదృగాణే చ యావత్యర్కాచ్చ తావతి. 8

మీనము ప్రశ్నలగ్నమయ్యెనేని మీనమందు చంద్రుఁడుండఁగా జననమని తెలియతగినది. ప్రశ్నలగ్నమున నేరాశిసంబంధమైన నవాంశ ముదయించునో ఆ రాశియే జన్మలగ్నమగునని తాత్పర్యము. మరియుం ప్రశ్నలగ్నద్రేక్కాణము మొదలు రవియున్న ద్రేక్కాణమువరకు లెక్కింపఁగా ఎన్నియగునో ప్రశ్నలగ్నము మొదలు లెక్కింపఁగా అన్నవరాశి జన్మలగ్నమగునని తెలియతగినది. ద్రేక్కాణములు ౧౨ కి అధికమయ్యెనేని ౧౨ పుచ్చి తక్కినవి లెక్కపెట్టి జన్మలగ్ననిర్ణయము జేయతగినదని భావము.

విలగ్నం కథయేత్ప్రాజ్ఞ ఇతి శాస్త్రస్య నిశ్చయః,
లగ్నగే వీర్యగేవాఽపి ఛాయాంగుళహతే హ్యతే. 9
రవిభి ర్జన్మలిప్తంహి కథయే దవిశంకితః,
అష్టత శ్శయనస్థస్య నివిష్టస్యోత్థితస్య చ. 10
లగ్నాదికేంద్ర పర్శ్వాని వదేజ్జన్మవిధా క్రమాత్,
భావం విచార్య సకలం యద్యత్తుల్యంతు తత్తదా. 11

మరియొకరీతిని లగ్ననిర్ణయము జెప్పుచున్నాఁడు. ప్రశ్నలగ్నమందున్న గ్రహమును తాత్కాలికగ్రహముగా పెట్టుకొని లిప్తలుజేసి ద్వాదశాంగుళశంకుజనితమైన

తాత్కాలికఛాయాంగుళములచే గుణించి పండ్రెండింట పాలుగొనఁగా మిగిలినసంఖ్య ఎన్నియగునో మేషము మొదలు అన్నవరాశి జన్మలగ్నమని తెలియఁదగినది. ప్రశ్నలగ్నమం దనేకగ్రహములుండెనేని ఆగ్రహములలో నేగ్రహము బలాధికమైయుండునో దానిని తాత్కాలికగ్రహముగా పెట్టుకొని లిప్తలుజేసి ఆలిప్తలను ద్వాదశాంగుళశంకువలన దృష్టములైన తాత్కాలికఛాయాంగుళములచేత గుణించి ౧౨ ట పాలుగొనఁగా ఎన్ని మిగులునో మేషము మొదలు అన్నవరాశి జన్మలగ్నమని తెలియఁదగినది. మరికొన్ని విధంబులు జెప్పుచున్నాఁడు:—నిలుచుండి ప్రశ్న జేసెనేని ప్రశ్నలగ్నమే జన్మలగ్నమనియు, పరుండి ప్రశ్న జేసెనేని ప్రశ్నలగ్నమునకు చతుర్థకేంద్రము జన్మలగ్నమనియు, కూర్చుండి ప్రశ్న జేసెనేని ప్రశ్నలగ్నమునకు సప్తమకేంద్రము జన్మలగ్నమనియు, నడుచుచుండి ప్రశ్న జేసెనేని ప్రశ్నలగ్నమునకు దశమకేంద్రము జన్మలగ్నమనియుఁ జెప్పఁదగినదని భావము.

సంస్కారనామమాత్రా ద్విగుణాఛాయాంగులైస్సమాయుక్తాః,
త్రిఘనవిభక్తాచ్ఛేషం నక్షత్రం తద్ధనిష్ఠాది. 12

ప్రకారాంతరముగ నక్షత్రము నెఱుఁగుక్రమమును జెప్పుచున్నాఁడు:—మాతాపిత్రాదులచే విధ్యుక్తప్రకారముగా నుంచఁబడిన నామధేయముయొక్క మాత్రలను అనఁగా హల్లు అర్ధమాత్రకము, అచ్చు ఏకమాత్రకము. ఈప్రకారముగా ఆనామాక్షరము లెన్ని మాత్ర లగుచున్నవో ఆమాత్రసంఖ్యను రెండింట గుణించి తత్కాలమందు ద్వాదశాంగుళశంకువలని ఛాయాంగుళములతోఁ గూడి ౨౭ ట భాగించఁగా శేషము ఎన్ని మిగులునో ధనిష్ఠాదిగా అన్నవనక్షత్రమందు జననమని తెలియఁదగినది.

నృపసింహౌ దశగుణితౌ వసుభిర్మిథునాలికౌ నగైర్జ్ఞేయౌ,
మునిభిః కన్యామకరౌ బాణైర్మేషాస్సవసంమితైరేవ. 13
గురుణా కుజేన భృగుణా బుధేందుభాన్వర్కిభిః క్రమశః,
వర్షర్తుమాసతిథిదినా ద్యునిశాభనవాంశవేలాశ్చ. 14
ఏవం క్రమేణ హత్వా స్వవిభక్తవిభాజితాచ్ఛేషం,
ఏవం భవంతి సర్వే నవదానవిశోధనే చ పునః. 15

నష్టజాతకమంతయు ప్రకారాంతరముగఁ జెప్పుచున్నవాఁడై ప్రశ్నకాలమందు తాత్కాలికలగ్నమును లిప్తలుజేసి చేయుఁదగినది. రాశిగుణకార గ్రహగుణకారక్రమమును జెప్పుచున్నాఁడు: గుణకారంబు లెవ్వియనిన: వృషభసింహములకు ౧౦ మిథునవృశ్చికములకు ౮ మేషతులలకు ౭ కన్యామకరములకు ౫ తక్కిన కర్క-

టమునకు ౮ ధనుస్సుకు ౯ కుంభమునకు ౧౧ మీనమునకు ౧౨ గ్రహగుణకార ములు గురునకు ౧౦ కుజునకు ౮ శుక్రునకు ౭ రవిచంద్ర బుధశనులకు ౫

| మే | వృ | మి | క | సి | క | తు | వృ | ధ | మ | కు | మీ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౭ | ౧౦ | ౮ | ౪ | ౧౦ | ౫ | ౭ | ౮ | ౯ | ౫ | ౧౧ | ౧౨ |

| ర | చ | కు | బు | గు | శు | శ |
|---|---|---|---|---|---|---|
| ౫ | ౫ | ౮ | ౫ | ౧౦ | ౭ | ౫ |

ప్రశ్నలగ్నమును లిప్తలుజేసి ఈచెప్పఁబడిన క్రమంబున రాశిగుణకారములచే గుణించి తదుపరి ప్రశ్నలగ్నమం దొకగ్రహముండెనేని ఆగ్రహగుణకారముచేతనుం గుణింప వలయును. అనేకగ్రహములుండెనేని అన్నిగ్రహముల గుణకారములచేతను గుణింప వలయును. లగ్నము గ్రహశూన్యమయ్యెనేని గ్రహగుణకము లేదనిభావము. తదుపరి సంవత్సర ఋతు మాస తిథి దిన రాత్రి రాశి నవాంశవేళలను ఎఱుంగుతెఱఁగును జెప్పుచున్నాఁడు:—ప్రశ్నలగ్నలిప్తలను రాశిగ్రహగుణకారానంతరమునందు మరల ఆసంఖ్యను నాలుగుతావులయందుంచి అందు మొదటనున్నదాని ౧౦ టను రెండవ చోట నున్నదాని ౮ టను మూఁడవచోట నున్నదాని ౭ టను నాలవతావున నున్న దాని ౫ టను గుణించి ఆనాలుగువిధములైన సంఖ్యలయందును నవకదానవిశోధనము జేయవలయును. ఎట్లన: భట్టోత్పలమతానుసారముగ ప్రశ్నలగ్నమందు ప్రథమ ద్రేక్కాణ మయ్యెనేని ఆనాలుగువిధములైన సంఖ్యలయందును ౯ కూడవలయును. ద్వితీయద్రేక్కాణ మయ్యెనేని కూడనక్కరలేదు తీయనక్కరలేదు. తృతీయద్రే క్కాణ మయ్యెనేని ౯ తీయవలయును, ఇట్లు నవకదానవిశోధనముజేసి వక్ష్యమాణ ప్రకారముగ వర్షాదిసంఖ్యలచేత పాలుగొనఁగా వర్షర్తుమాసాదులు ఏర్పడును. ఎట్లన: ౧౦ ట గుణించి నవకదానవిశోధనము జేసినసంఖ్యను పరమాయుఃప్రమాణము లైన ౧౨౦ చేత పాలుగొనఁగా శేషము పృచ్ఛకుని వర్తమానవర్షసంఖ్యయగును. కొందఱు ఆసంఖ్యను ౬౦ ట పాలుగొనఁగా ఎన్నిమిగులునో ప్రభవాదిగా అన్నవ సంవత్సరమందు జననమని చెప్పవచ్చునందురు. ఆపదింట గుణించినసంఖ్యనే ఋతు వికల్పమైన ౬ ట పాలుగొనఁగా నెన్నిమిగులునో శిశిరాదిగా అన్నవఋతువందు జనన మని చెప్పవలయును. ఆఋతుశేషసంఖ్యనే మాససంఖ్యావికల్పములైన ౨ ట పాలు గొనఁగా ౧ మిగిలినేని ఆఋతువునందు మొదటమాసమనియుం, రెండు మిగిలినేని అనఁగా శేషము లేకుండెనేని రెండవమాసమనియుం తెలియతగినది. ఈరీతిగా దశసం ఖ్యాగుణితసంఖ్యవలన వర్షఋతుమాసములు తెలుసుకొనతగినవి. ఆప్రకారముగనే ౮ ట గుణించి నవకదానవిశోధము జేసినసంఖ్యను పక్షవికల్పమైన ౨ ట పాలుగొనఁగా ౧ మిగిలెనేని శుక్లపక్షమనియుం, శూన్యమయ్యెనేని కృష్ణపక్షమనియుం తెలియతగినది. ఆ ౮ ట గుణించినసంఖ్యనే తిథివికల్పమైన ౧౫ ట పాలుగొనఁగా ఎన్నిమిగులునో

అన్నవతిథియని చెప్పతగినది. ఆప్రకారముగనే ౭ ట గుణించి నవకదానవిశోధనము జేసినసంఖ్యను దివారాత్రివికల్పమైన ౨ ట పాలుగొనఁగా ౧ టి మిగిలెనేని పగలు జననమనియు, శేషము లేకుండెనేని రాత్రిజననమనియు తెలియతగినది. ఆప్రకారమే ౭ ట గుణించి నవకదానవిశోధనము జేసినసంఖ్యను నక్షత్రవికల్పమైన ౨౭ ట పాలుగొనఁగా నెన్నిమిగులునో అశ్విన్యాదిగా అన్నోనక్షత్రమందు జననమని తెలియతగినది. ఆప్రకారమే ౫ ట గుణించి నవకదానవిశోధనము జేసినసంఖ్యను ఏదిన మందు పగలు జననమని ఏర్పడునో ఆదినప్రమాణఘటికలచేత పాలుగొనఁగా నెన్ని మిగులునో అన్నిఘడియలకు పగలు జననమని తెలియతగినది. రాత్రి జననమని ఏర్ప డెనేని రాత్రిప్రమాణముచేత పాలుగొనఁగా నెన్ని మిగులనో అన్నిఘడియలకు రాత్రిజననమని తెలియతగినది ఆ ౫ ట గుణించినసంఖ్యనే రాశివికల్పమైన ౧౨ ట పాలుగొనఁగా నెన్నిమిగులునో మేషాదిగా అన్నవరాశి జన్మలగ్నమగునని చెప్పతగినది. హోరా ద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలను తాత్కాలికగ్రహంబులను ఈచెప్పఁబడిన విధానముచే నిర్ణయించి దశాంతర్దశాష్టకవర్గాదిఫలనిర్దేశము చేయతగినది. ఇట్లు నష్టజాతకమును సాధించవలెను.

యవనేంద్రదర్శనాద్యైః కథితం తదిహాత్ర సర్వమేవ మయా,
కింతు స్ఫుటం న సర్వం స్పష్టం సారస్వతం చింత్యమ్. 16

యవనాదులమతమును వ్యక్తపరచితిని గాని స్ఫుటమైనది గాదు. సారస్వత మతము స్ఫుటమైనది గనుక ఆలోచించతగినది.

పాదత్రితయం విదళం దినరజనీమానయోః క్రమాత్కార్యమశః,
పృచ్ఛకరాశిసమానై ర్దివసనిశాసంజ్ఞితాః పిండమ్. 17

తాత్పర్యము మృగ్యము.

వారఘ్నమనిహృతాగ్రం ప్రోద్గచ్ఛతి తావదేవ నక్షత్రం,
అశ్వీమఘామూలాద్యం నవకం నవకం క్రమాద్దృక్షమ్. 18

తాత్పర్యము మృగ్యము.

తల్లిప్తా సప్తహృతాచ్ఛేషాద్వారో భవేచ్చ బుధాద్ది,
శేషం ప్రాగ్వత్కార్యం పృచ్ఛకసూర్యాదిభిర్ధాయమ్.  19

తాత్పర్యము మృగ్యము.

ఉద్గతదశావ్యతీతాగమ్యాథ విలోమతో భవేన్నిత్యం,
తావత్సంఖ్యా యోజ్యా నష్టవిధౌ కాలపరిమాణే. 20

బృహజ్జాతకాదిగ్రంథములయందు సారస్వతమతము లేకపోవుటచేతను ఈశ్లోకములయందు స్ఖాలిత్యము లుండుటవల్లను తాత్పర్యము వ్రాయఁబడలేదు.

ఇతి ఏకపంచాశోఽధ్యాయః.

---

## అష్టకవర్గమును దెలుపు ఏఁబదిరెండవ యధ్యాయము.

ఉక్తో హి యవనవృద్ధై రష్టకవర్గో నివేదయతి పుంసాం,
హేతుం శుభ మశుభంవా ప్రతిదివసం సంభవంత మిహ. 1

పూర్వమందు యవనాదులచే చెప్పఁబడిన అష్టకవర్గమున్ను తదనుసారముగ పురుషులకు గలుగు అష్టకవర్గఫలమునున్ను జెప్పుచున్నానని తాత్పర్యము.

స్వాత్కేంద్రాయనవాష్టవిత్తగృహగో భౌమార్కసూన్వోరవి
ర్జీవాదాయ నవాత్మజారిషు సితా త్షడ్ద్వాదశా స్తస్థితః,
చంద్రాద్వ్యృద్ధిషు బోధనా త్సనవధీరిఃఫేషు లగ్నాచ్ఛుభ
స్సాంబుద్వాదశగోఽష్టవర్గవిధినా సంశోధితో భాస్కరః. 2

సూర్యుఁడు జన్మకాలమున తానున్నరాశిమొదలుకొని ౧-౨-౪-౭-౮-౯-౧౦-౧౧ ఈస్థానములయందు చారవశంబున నున్నవాఁడైై శుభప్రదుఁడగును. చెప్పఁబడని స్థానములయందుండెనేని అశుభప్రదుఁడని అంతట తెలియతగినది. కుజుఁడున్నస్థానము మొదలు (రవికీవలెను) ౧-౨-౪-౭-౮-౯-౧౦-౧౧ స్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుండగును. శనియున్నస్థానము మొదలు (రవికీవలెను) ౧-౨-౪-౭-౮-౯ ౧౦-౧౧ స్థానములయందున్న రవి శుభఫలప్రదుం డగును. గురుఁ డున్నస్థానము మొదలు ౫-౬-౯-౧౧ ఈస్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుం డగును. శుక్రుఁ డున్నస్థానము మొదలు ౬-౭-౧౨ ఈస్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుం డగును. చంద్రుఁడున్న స్థానము మొదలుకొని ౩-౬-౧౦-౧౧ ఈస్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుం డగును. బుధుఁడున్నస్థానము మొదలు ౩-౫-౬-౯-౧౦-౧౧-౧౨ ఈస్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుం డగును. లగ్నము మొదలుకొని ౩-౪-౬-౧౦-౧౧-౧౨ ఈస్థానములయందున్న సూర్యుఁడు శుభఫలప్రదుం డగును. ఇది సూర్యాష్టకవర్గము.

లగ్నాద్వా త్రిత్రృదశాయశత్రుషు శశీ సాస్తాదిషు స్వాచ్ఛుభో
భౌమాత్స్వర్థసవాత్మజేషు రవితస్సాష్టాంగనాస్థో గురోః,
కేంద్రాంత్యాష్టభవేషు ధర్మసుఖధీత్ర్యాయాస్తఖస్థస్సితా
త్కేంద్రాయత్రిసుతాష్టగశ్శనిసుతాద్ధీత్ర్యాయషట్స్వర్కజాత్. 3

చంద్రాష్టకవర్గును జెప్పుచున్నాఁడు. లగ్నము మొదలు ౩-౬-౧౦-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. తానున్నస్థానము మొదలు ౧-౩-౬-౭-౧౦-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. కుజుఁడున్నస్థానము మొదలు ౨-౩-౫-౬-౯-౧౦-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. సూర్యుఁడున్నస్థానము మొదలు ౩-౬-౭-౮-౧౦-౧౧ బృహస్పతి యున్నస్థానము మొదలుకొని ౧-౪-౭-౮-౧౦-౧౧-౧౨ ఈస్థానములయందు చంద్రుఁడున్న శుభప్రదుం డగును శుక్రుఁడున్నస్థానము మొదలు ౩-౪-౫-౭-౯-౧౦-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. బుధుఁడున్నస్థానము మొదలు ౧-౩-౪-౫-౭-౮-౧౦-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభుఁడగును. శనియున్నస్థానము మొదలు ౩-౫-౬-౧౧ ఈస్థానములయందున్న చంద్రుఁడు శుభప్రదుం డగును. ఇది చంద్రాష్టకవర్గము.

భౌమో వృద్ధిషు సాత్మజాసు రవితస్సాద్యేషు లగ్నాత్సధీ
శ్చంద్రాత్సత్రిదశేషు కేంద్రనిధనప్రాప్త్యర్థగస్స్వాద్గ్రహః,
ధర్మాయాష్టమకేంద్రగో రవిజాజ్జ్ఞాత్త్ర్యాయషట్ధీత్రిషు
శుక్రాదంత్యభవారిమృత్యుషు గురోష్షల్లాభకర్మాంత్యగః. 4

కుజాష్టకవర్గమును జెప్పుచున్నాఁడు. రవియున్నస్థానము మొదలు ౩-౫-౬-౧౦-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుం డగును. లగ్నము మొదలు ౧-౩-౬-౧౦-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁడగును. చంద్రుఁడున్నస్థానము మొదలు ౩-౬-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁడగును. కుజుఁడు (తానున్న) స్థానము మొదలు ౧-౨-౪-౭-౮-౧౦-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁ డగును. శనియున్నస్థానము మొదలు ౧-౪-౭-౮-౯-౧౦-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁడగును. బుధుఁడున్న స్థానము మొదలు ౩-౫-౬-౧౧ ఈస్థానములయందున్న కుజుఁడు శుభుఁడగును. శుక్రుఁడున్నస్థానము మొదలు ౬-౮-౧౧-౧౨ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁ డగును. గురుఁడున్నస్థానము మొదలు ౬-౧౦-౧౧-౧౨ ఈస్థానములయందున్న కుజుఁడు శుభప్రదుఁ డగును. ఇది కుజాష్టకవర్గము.

జ్ఞో౽ష్టాయాదిశుభార్థబంధుషు సుతభ్రాతృస్థితో భార్గవా
ద్వ్యాభమారార్క్యస్సదశాస్తగో రిపుభవచ్ఛిద్రాంత్యసంస్థోగురోః,
ప్రాప్త్యంత్యారితపస్సుతేషు తపనాత్స్వాత్సత్రికర్మాదిషు
స్వాజ్ఞాయారిసుఖాష్టమేషు శశినోస్వాద్యేషు లగ్నాచ్ఛుభః. 5

బుధాష్టకవర్గమును జెప్పుచున్నాఁడు. శుక్రుఁడున్న స్థానము మొదలు ౧-౨-౩-౪-౫-౮-౯-౧౧ ఈస్థానములయందున్న బుధుఁడు శుభుఁడగును. కుజుఁడున్న స్థానము మొదలు శనియున్న స్థానము మొదలున్నూ ౧-౨-౩-౪-౫-౭-౮-౯-౧౦-౧౧ ఈ స్థానములయందున్న బుధుఁడు శుభుఁడగును. గురుఁడున్న స్థానము మొదలు ౬-౮-౧౧-౧౨ ఈస్థానములయందున్న బుధుఁడు శుభుఁడగును. సూర్యుఁడున్న స్థానము మొదలు ౫-౬-౯-౧౧-౧౨ ఈస్థానములందున్న బుధుఁడు శుభుఁడగును. తానున్న స్థానము మొదలు ౧-౩-౫-౬-౯-౧౦-౧౧-౧౨ ఈస్థానములయందున్న బుధుఁడు శుభుఁడగును. చంద్రుఁడున్న స్థానము మొదలు ౨-౪-౬-౮-౧౦-౧౧ ఈస్థానముల యందున్న బుధుఁడు శుభుఁడగును. లగ్నమువల్లనుండి ౧-౨-౪-౬-౮-౧౦-౧౧ ఈ స్థానములయందున్న బుధుఁడు శుభప్రదుఁడగును.

కేంద్రాయాష్టధనేషు భూమితనయాత్స్వాత్సత్రిషు బ్రాహ్మణో
భానోస్సత్రినవేషు ధర్మదశధీస్వాయారిగో భార్గవాత్,
ధర్మాయాస్తధనాత్మజేషు శశినః కోణాత్రిషడ్వ్యయే
స్వాజ్ఞాయాంబునవారిపుత్రతనుషు జ్ఞాత్సాస్తగస్త్వాదయాత్. 6

గుర్వష్టకవర్గు జెప్పుచున్నాఁడు. కుజుఁడున్న స్థానమునకు ౧-౨-౪-౭-౮-౧౦-౧౧ ఈస్థానములయందున్న గురుఁడు శుభప్రదుఁడగును. తానున్న స్థానము మొదలు ౧-౨-౩-౪-౭-౮-౧౦-౧౧ స్థానములయందున్న గురుఁడు శుభుఁడగును. సూర్యుఁడున్న స్థానము మొదలు ౧-౨-౩-౪-౭-౮-౯-౧౦-౧౧ ఈస్థానములయందున్న గురుఁడు శుభుఁడగును. శుక్రుఁడున్న స్థానము మొదలు ౨-౫-౬-౯-౧౦-౧౧ స్థానములయందున్న గురుఁడు శుభుఁడగును. చంద్రుఁడున్న స్థానము మొదలు ౨-౫-౭-౯-౧౧ ఈస్థానములయందున్న గురుఁడు శుభుఁడగును. శనియున్న స్థానము మొదలు ౩-౫-౬-౧౨ స్థానములయందున్న గురుఁడు శుభుఁడగును. బుధుఁడున్న స్థానము మొదలు ౧-౨-౪-౫-౬-౯-౧౦-౧౧ ఈస్థానములయందు గురుఁడు శుభుఁడగును. లగ్నము మొదలు ౧-౨-౪-౫-౬-౭-౯-౧౦-౧౧ ఈస్థానములయందైన గురుఁడు శుభప్రదుఁడగునని భావము. ఇది గుర్వష్టకవర్గము.

లగ్నాదాతనయాయరంధ్రనవగశ్చంద్రాత్సితస్స్వవ్యయ
స్వాన్త్యాన్యజ్ఞేషు శుభోఽయమాన్నవదశత్ర్యాయాష్టపంచాంబుషు,
త్ర్యంత్యాయారిసుహ్వాన్నవేషు రుధిరాద్రిఃఘాయరంధ్రేష్వినా
జ్ఞాత్ర్యాయారినవాత్మజేష్వథగురోర్ధీభాష్టధర్మాయగః. 7

శుక్రాష్టకవర్గును జెప్పుచున్నాఁడు. లగ్నము మొదలు ౧-౨-౩-౪-౫-౮-౯-౧౧ ఈస్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. చంద్రుఁడున్నస్థానము మొదలు ౧-౨-౩-౪-౫-౮-౯-౧౧-౧౨ ఈస్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. తానున్న రాశి మొదలు ౧-౨-౩-౪-౫-౮-౯-౧౦-౧౧ ఈ స్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. శనియున్నస్థానము మొదలు ౩-౪-౫-౮-౯-౧౦-౧౧ ఈస్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. కుజుఁడున్నస్థానము మొదలు ౩-౫-౬-౯-౧౧-౧౨ ఈస్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. సూర్యుఁడున్నస్థానము మొదలు ౮-౧౧-౧౨ స్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. బుధుఁడున్న స్థానము మొదలు ౩-౫-౬-౯-౧౧ స్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును. గురుఁడున్నస్థానము మొదలు ౫-౮-౯-౧౦-౧౧ స్థానములయందున్న శుక్రుఁడు శుభుఁడగును.

స్వాద్యాయాత్మజషట్త్రికేషు రవిజస్స్వాంత్యాంబరస్థఃకుజా
ద్భానోః కేంద్రధనాయ మృత్యుషు తనోస్త్ర్యాయమారిఖాద్యాంబుగః,
ఆజ్ఞాయాష్టనవాంత్యశత్రుషు బుధాదిందోర్భవారిత్రిషు
శుక్రాదంత్యభవారిషు ద్విజవరాత్పుత్రష్ట్యంత్యధీశత్రుగః. 8

శనైశ్చరాష్టకవర్గును జెప్పుచున్నాఁడు. శనైశ్చరుఁడు జన్మకాలమున తానున్న రాశి మొదలు ౩-౫-౬-౧౧ స్థానములయందున్నశని శుభుఁడగును. కుజుఁడున్న స్థానము మొదలు ౩-౫-౬-౧౦-౧౧-౧౨ స్థానములయందున్న శని శుభుఁడగును. సూర్యుఁడున్నస్థానము మొదలు ౧-౨-౪-౭-౮-౧౦-౧౧ స్థానములయందున్నశని శుభుఁడగును. లగ్నము మొదలు ౧-౩-౪-౬-౧౦-౧౧ స్థానములయందున్నశని శుభుఁడగును. బుధుఁడున్నస్థానము మొదలు ౬-౮-౯-౧౦-౧౧-౧౨ స్థానములయందున్నశని శుభుఁడగును. చంద్రుఁడున్నస్థానము మొదలు ౩-౬-౧౧ స్థానములయందున్నశని శుభుఁడగును. శుక్రుఁడున్నస్థానము మొదలు ౬-౧౧-౧౨ స్థానములయందున్నశని శుభుఁడగును. గురుఁడున్నస్థానము మొదలు ౫-౬-౧౧-౧౨ స్థానములయందున్నశని శుభుఁడగును. ఇది శన్యష్టకవర్గము.

ఇత్యుక్తం శుభమన్యదేవ మశుభం చారక్రమేణ గ్రహా
శ్శస్తాశ్శస్తవిశేషితం విదధతి ప్రోత్కృష్ట మేతత్ఫలం,
స్వర్క్షస్వోచ్చ సుహృద్గ్రహేషు సుతరాం శస్తం త్వనిష్టం సమం
స్వస్వస్వామిగతా దశాపతిబలా ద్ధంత్యష్టవర్గోద్భవమ్. ౯

జన్మకాలమునందు ఏయేస్థానములయందు గ్రహములుండునో ఆయేదుస్థానములు జన్మలగ్నము గలసి ఈ ౮ స్థానములలో నొక్కొక్క స్థానము మొదలుకొని ఆ అష్టకవర్గమందు ఇష్టానిష్టసంశోధనము జేయుటవలన ఇష్టానిష్టఫలపరిపాకము దెలుసును. అనఁగా రాశిచక్రమందు జన్మకాలికగ్రహస్థితి వ్రాసి ఏగ్రహాష్టకవర్గమందు ఏస్థానములు శుభములని చెప్పఁబడుచున్నవో ఆస్థానములయందు సున్నలు తదితరస్థానములయందు రేఖలును వ్రాయఁగా ఏరాశికి బిందువులు అధికముగా నుండునో ఆరాశికి సంచారక్రమముగా గ్రహము వచ్చినప్పుడు శుభము నిచ్చును. ఏరాశికి రేఖలు అధికముగ వచ్చునో ఆరాశికి సంచారక్రమముగా గ్రహము వచ్చినప్పుడు అశుభము నిచ్చును. అది ఎట్లనిన: ఏగ్రహముయొక్క అష్టకవర్గమందు ఏరాశికి ౮ బిందువులు వచ్చునో ఆగ్రహము ఆరాశికి వచ్చినప్పుడు సంపూర్ణశుభము నిచ్చును. ౭ బిందువులు ౧ రేఖ వచ్చెనేని బిందుసంఖ్యయందు రేఖాసంఖ్యను తోసివేయఁగా ఆఱుబిందువులు మిగులును గనుక ముప్పాతికశుభము నిచ్చును. ౬ బిందువులు ౨ రేఖలు వచ్చెనేని తోసివేయఁగా ౪ బిందువులు మిగులునుగాన అర్ధశుభము నిచ్చును. ౫ బిందువులు 3 రేఖలు వచ్చెనేని పాదాంశశుభమునిచ్చును. ౪ బిందువులు ౪ రేఖలు వచ్చెనేని శుభాశుభమిశ్రమమైన మధ్యమఫలము నిచ్చును. ౮ రేఖలు వచ్చెనేని అశుభఫలమును సంపూర్ణముగ నిచ్చును. ౭ రేఖలు ౧ బిందువు వచ్చెనేని ముప్పాతినిపాలి యశుభము నిచ్చును. ౬ రేఖలు ౨ బిందువులు వచ్చెనేని అరపాలి యశుభము నిచ్చును. ౫ రేఖలు 3 బిందువులు వచ్చెనేని పాతికెపాలి అశుభఫలము నిచ్చును. స్వక్షేత్రములయందును ఉచ్చక్షేత్రములయందును మూలత్రికోణములయందును మిత్రక్షేత్రములయందును ఉన్నగ్రహము అష్టకవర్గమందు శుభము నిచ్చునట్టిదయ్యెనేని అప్పుడు మిక్కిలి శుభఫలము నిచ్చును. అష్టకవర్గమందు అశుభఫలము నిచ్చునట్టిదయ్యెనేని మధ్యమఫలము నిచ్చును. ఇట్లు చెప్పుటవలన నీచారిశత్రుక్షేత్రములయందున్నగ్రహము అష్టకవర్గమునందు అశుభఫలము నిచ్చునట్టిదయ్యెనేని మిక్కిలి అశుభఫలము నిచ్చుననియు అష్టకవర్గమందు శుభమునిచ్చునట్టిదయ్యెనేని మధ్యమఫలము నిచ్చుననియు భావము. ఈచెప్పఁబడినరీతిగా చారక్రమముగా శుభప్రదమగు కాలమైనను దశాధిపతి అశుభుఁడై బలహీనుఁడై యుండెనేని అష్టకవర్గజనితమైన గోచార

ఫలము నశించుననియు చారక్రమముగా అశుభప్రదమగు కాలమైనను దశాధిపతి బలయుక్తుఁడై శుభప్రదుఁడై యుండెనేని గోచారఫలము జరుగక శుభము గలుగుననియు తాత్పర్యము.

రవికుధిరౌ భవనం ప్రవిశంతౌ గురుభృగుజౌ గృహమధ్యసమేతౌ,
శనిశశినౌ ఖలు నిర్గమకాలే శశితనయః ఫలదస్తు సదైవ. 10

అష్టకవర్గఫలకాలమును జెప్పుచున్నాఁడు. రవికుజులు ప్రవేశకాలమందు అనఁగా చారవశంబున ఏరాశియందుండి శుభముగాని అశుభమునుగాని అష్టకవర్గ ఫలము నిత్తురో ఆరాశియొక్క మొదటి తృతీయాంశమం దుండునపుడు రవికుజులు ఫలము నిత్తురు. గురుశుక్రులు ఆరాశియొక్క మధ్యతృతీయాంశమం దుండునపుడు ఫలము నిత్తురు. చంద్రశనులు ఆరాశియొక్క అంత్యతృతీయాంశమం దుండునపుడు ఫలమునిత్తురు. బుధుఁడు ఆరాశియం దెన్నిదినములుండునో అన్నిదినములును ఫలము నిచ్చువాఁడని తాత్పర్యము.

ఇతి ద్విపంచాశోఽధ్యాయః.

---

## వియోనిజన్మమును దెలుపు ఏఁబదిమూఁడవ యధ్యాయము.

దైవవిదాం ప్రీతికరం విశ్వాసనీయం సమస్తలోకస్య,
కనకాచార్యస్య మతా ద్ద్వియోనిసంజ్ఞం ప్రవక్ష్యామి. 1

శ్రీకనకాచార్యులవారి మతానుసారముగ దైవజ్ఞులకు ప్రీతిగలుగునట్లుగను సర్వజనులకు విశ్వాసము గలుగునట్లుగను ద్వియోనిజన్మాధ్యాయమును జెప్పఁబోవుచున్నాను.

లగ్నే కర్కటకే సశీతకిరణే వాసద్గ్రహైస్సంగతే
స్వర్క్షస్థైర్జగతోఽస్య సృష్టిమకరోద్విశ్వేశ్వరశ్శాశ్వతీం,
యస్యైవం భవతి ప్రసూతిసమయే పుంసస్సంపాలయే
త్రైలోక్యం సురసుందరీజనవృతః క్రీడాం సమాసేవతే. 2

లగ్నము కర్కటకము లగ్నమున శుభయుతుఁడైనచంద్రుఁడు లేక గ్రహము లన్నియు క్రమముగ స్వక్షేత్రములయందుండఁగాను జగదీశ్వరుఁడు శాశ్వతమైన సృష్టిని గలుగఁజేసెను. అనఁగా గ్రహస్థితి అతిశుభప్రదమైనదిగాన ఏవనిజన్మసమయ

మున ఇటువంటి గ్రహస్థితి గలుగునో వాఁడు త్రిలోకములయందును అప్సరసాములతోఁ గలసి క్రీడించుచుండువాఁ డగునని తాత్పర్యము.

సమభివ్యనక్తిహోరా సస్థావరజంగమం యథాలోకే,
కాలనిమిత్తాకారై ర్దేశేన చ తత్ప్రపంచోఽయమ్. 3

లోకమునందు కాలస్వరూపముల చేతను దేశముచేతను యేరీతిగ స్థావరజంగమరూప మగుజగత్తును హోరాశాస్త్రము ప్రకటనజేయునో ఆసమస్తము ఈయధ్యాయమునందుఁ జెప్పఁబడునని తాత్పర్యము. స్థావరజంగమజాతకవిభేద మీయధ్యాయమందు గలదు.

క్రూరైస్సుబలసమేతైస్సౌమ్యైర్విబలై ర్వియోనిలగ్నే వా,
సౌమ్యార్కిభ్యాం కేంద్రే తదీక్షితే వా వియోనిస్స్యాత్. 4
ఆధానే జన్మని వా ప్రశ్నే వా ద్వాదశాంశగే చంద్రః,
యస్మిన్వ్యవస్థితస్స్యాల్లగ్నే వా తత్సమం సత్త్వమ్. 5

వియోనిజన్మమనఁగా నానావిధములైన ఉత్పత్తిస్థానములుగల తిర్యక్పక్షి మృగాశ్వమహిష వృషభ శునక మార్జార స్థావరాదులయొక్క ఉత్పత్తి. అందు దైవజ్ఞపరీక్షార్థముగాని ఉత్పన్నజంతుక్షేమాది పరిజ్ఞానార్థమైగాని ఎవ్వరైనను ప్రశ్న జేయుదురు. కాఁబట్టి అట్టిప్రశ్న సేయువారివలన జన్మకాలము నెఱింగి వక్ష్యమాణక్రమంబున విచారముజేయఁగా వియోనిజన్మనిశ్చయజ్ఞానము గలుగుచున్నది. కావున ఆవిషయము నీ అధ్యాయమందుఁ జెప్పుచున్నాఁడు. ఆధానకాలము ననుసరించిగాని లేక జన్మకాలము ననుసరించిగాని లేక ప్రశ్నకాలము ననుసరించిగాని రవికుజశనులును పాపగ్రహయుక్తబుధుఁడు క్షీణచంద్రుఁడును ఈపాపగ్రహములు బలవంతులై యుండి శుభగ్రహములు బలహీనులై యుండఁగా బుధశనులు కేంద్రములయందున్నను లేక లగ్నమందున్నను లేక బుధశనులచేఁ జూడఁబడుచున్నను వియోనిజన్మ గలుగును. ఏసంజ్ఞగలదియన: చంద్రుఁడున్న ద్వాదశాంశముగాని లేక లగ్నముగాని మృగమేషాదితిర్యగ్జంతునామము గలిగినదాయెనేని వియోనిజన్మమును జెప్పవలయును. అటుగాకపోయినయెడల జెప్పఁగూడదు. చంద్రుఁడు మేషద్వాదశాంశయందున్నను లగ్నము మేషమైనను మేక గొఱ్ఱె మొదలైనవానిజన్మమును జెప్పవలయును. చంద్రుఁడు వృషభద్వాదశాంశయందున్నను లగ్నము వృషభమైనను వృషభ మహిషాదిజననము గలుగును. చంద్రుఁడు కర్కటద్వాదశాంశయందుండెనేని లగ్నము కర్కటకమయ్యెనేని ఎండ్రకాయ మొదలైనవాని జన్మమనియు, చంద్రుఁడు సింహద్వాదశాంశయందున్నను లగ్నము సింహమైనను సింహశార్దూలజంబుకశునక

మార్జారాదిజననమనియుం, చంద్రుఁడు వృశ్చికద్వాదశాంశయం దుండెనేనియు లగ్నము వృశ్చికమైనను సర్పవృశ్చికకీటాదిజననమనియు, చంద్రుఁడు ధనుర్ద్వాదశాంశో త్తరార్ధమం దున్నను లగ్నము ధనురుత్తరార్ధమైనను అశ్వగర్దభాదిజనన మనియుంను, చంద్రుఁడు మకరద్వాదశాంశపూర్వార్ధమం దున్నను లగ్నము మకరపూర్వార్ధమైనను మృగజననమనియుం, ఉత్తరార్ధమందుండెనేని కప్పమొదలగు జలచరజంతుజనన మున్నూ చంద్రుఁడు మీనద్వాదశాంశయందుండెనేనియు లగ్నము మీనమైనను మత్స్యజననమనియుఁ జెప్పవలయుం.

వర్ణాకృతిప్రభేదాద్గ్రిహయోగనిరీక్షణైర్మునిభిరుక్తాః,
తానహమపి ప్రవక్ష్యే విశేషత స్సారమాదాయ. 6

గ్రహయోగమును దృష్టిని అనుసరించి వర్ణము ఆకృతి మొదలైనవి యోని జన్మభేదములను పూర్వశాస్త్రానుసారముగ అందలిసారమును గ్రహించి విస్తరించి చెప్పఁబోవుచున్నానని భావము.

మేషవృషౌ ముఖగలయోరంసకపాదేషు మిథునమీనౌస్థః,
పృష్ఠోదయపార్శ్వేషు చ నివేశితౌ కర్కికుంభధరౌ. 7
సింహమృగౌ జఘనస్థౌ పశ్చిమచరణే స్థితౌ యువతిచాపౌ,
గుహ్యావృషణప్రదేశస్థిక్పుచ్ఛౌ జూకకీటర్క్షౌ. 8

చతుష్పాదాది నానావిధములైన జంతువులయొక్క ముఖము మొదలైనవి మేషాదిరాసుల ననుసరించి తెలియఁదగినవి. ఎట్లన: మేషము ముఖము, వృషభము కంఠము, మిథునము భుజములు, మీనము పాదములు, కర్కటకము వీపు, కుంభము రెండుప్రక్కలు, సింహమకరములు జఘనములు. అనఁగా రెండుపిక్కలు, కన్యాధనుస్సులు పాదములయొక్క వెనుకభాగములు, తుల పిఱుఁదులు, వృశ్చికము తోఁక, తుల గుదస్థానము, వృశ్చికము మేఢ్రవృషణములున్నూ అని తెలియఁదగినది. బృహజ్జాతకమునం దీయవయవములు భిన్నముగ నున్నవి.

మిథునాదయ స్తులాంతాస్సవ్యేభాగే చతుష్పదానాం చ,
వామేఝషఘటధరమృగకార్ముకభృద్వృశ్చికా స్సంతాస్సాః. 9

మిథునకర్కట సింహకన్యాతులలు చతుష్పదాది జంతువులయొక్క సవ్యభాగమనియుం, వృశ్చికధనుర్మకరకుంభమీనములు వామభాగమనియుం తాత్పర్యము. దీని ననుసరించి పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడిన భుజములు పాదములు మొదలైన ప్రదేశములయొక్క సవ్యవామభాగముల విమర్శ జేయఁదగినదని భావము.

మేషాదిభిరుదయస్థై రంశై ర్వా గ్రహాయుతైశ్చ దృష్టైర్వా,
స్వంస్వం వర్ణం బ్రూయా ద్గాత్రే చిహ్నం వ్రణం వాఽపి. 10

వియోనిజంతువర్ణాదులను జెప్పుచున్నాఁడు లగ్నమందు ఏగ్రహముండునో ఆగ్రహమునకుఁ జెప్పఁబోవురీతిని ఏవర్ణము చెప్పఁబడియున్నదో ఆవర్ణమును వియోని జంతువునకు చెప్పతగినది. లగ్నమందు గ్రహము లేనిపక్షమందు ఏగ్రహముచేఁ జూడఁ బడుచున్నదో ఆగ్రహముయొక్క వర్ణమును వియోనిజంతువుకుఁ జెప్పతగినది. లగ్నము ఏగ్రహముచేతను జూడఁబడక కూడఁబడక యుండెనేని లగ్నమందు ఏరాశి నవాంశ ముదయించుచున్నదో ఆరాశికి చెప్పినవర్ణమును వియోనిజంతువుకు చెప్పతగి నది. అనేకగ్రహములు లగ్నమందున్నను చూడఁబడినను బలవద్గ్రహవర్ణమును బాహు ళ్యముగాఁ జెప్పి బలహీనగ్రహవర్ణమును హీనముగఁ జెప్పతగినది. ఆగ్రహములను నవాంశను అనుసరించియే అంగములయందు పుట్టుమచ్చలు వ్రణములు మొదలైనవి తెలియతగినవి.

స్వగృహాంశకసంయోగాద్వింద్యాద్వర్ణాన్పరాంశకే సూతౌ,
సప్తమసంస్థాః కుర్యుః పృష్ఠే రేఖాం స్వవర్ణసమామ్. 11

లగ్నముగాని లగ్ననవాంశముగాని స్వస్వామియుక్తదృష్టమై యుండెనేని అప్పుడు ఆవర్ణమునే చెప్పవలయును. వియోనిజంతువుయొక్క ఏఅంగమందు ఏగ్రహ ముండునో ఆఅంగమందు ఆవర్ణము జెప్పతగినది. సప్తమస్థానమందున్న గ్రహముల చేత వీపునందైన రేఖలను దెలియతగినది.

వీక్షంతే యావంతో వియోనివర్ణాశ్చ తావంతః,
బలదీప్తో గగనచరః కరోతి వర్ణం వియోనీనామ్. 12

ఎన్నిగ్రహములు లగ్నమందుండునో జూచునో అన్నిగ్రహములవర్ణమును దెలి యతగినది. బలాధికగ్రహవర్ణము అధికముగ నుండును.

పీతం కరోతి జీవ శ్శశీసితం భార్గవో విచిత్రం చ,
రక్తం దినకరరుధిరౌ రవిజః కృష్ణం బుధ శ్శబలమ్. 13

పసుపుచాయకు బృహస్పతి, తెలుపుచాయకు చంద్రుఁడు, విచిత్రములైన నానా విధవర్ణములకు శుక్రుఁడు, రక్తవర్ణమునకు రవికుజులు, నీలవర్ణమునకు శని, పసురు వన్నెకు బుధుఁడు అధిపతు లగుదురని తాత్పర్యము.

స్వేరాశౌ పరభాగే పరరాశౌ స్వాంశకే తిష్ఠన్,
పశ్య న్గ్రహోఽపి లగ్నం స్వవర్ణవర్ణం తదా కురుతే. 14

గ్రహము స్వక్షేత్రమందు పరనవాంశయందైనను పరక్షేత్రమందు స్వనవాంశయందైనను నుండి లగ్నమును జూచెనేని ఆగ్రహవర్ణము గలుగును.

పరిఘపరివేషజలదైశ్శ్వంకుకపేధైర్ధ్వజైశ్చ వృక్షైశ్చ,
వృషమృగదండైస్సరైర్వశ్శక్రధనుః పాంసుభిర్వాఽపి. 15
యద్వర్ణేన వృతస్స్యాద్గ్రహస్తమిహవర్ణమాగిశేన్మతిమాన్,
స్వాభావికైర్గ్రహాణాం వర్ణైర్వర్ణా భవంతి జాతానామ్. 16

వియోనిజన్మకు కర్తయగు గ్రహము పరివేషాదులచేత నేవర్ణము గలిగియుండునో పుట్టినజంతువు ఆవర్ణము గలదియగును. అట్లు లేనిచో ఆగ్రహవర్ణమే గలిగియుండునని భావము.

విహగోదితద్రేక్కాణే గ్రహేణ బలినా యుతేచ చరభాంశే,
బౌధేంశేవా విహగా స్థలాంబుజాశ్శనిశశీక్షితాద్యోగాత్. 17

పక్షిజన్మజ్ఞానసాధనము ఎట్లన: పక్షిద్రేక్కాణము అనఁగా మిథునద్వితీయద్రేక్కాణము సింహప్రథమద్రేక్కాణము తులాద్వితీయద్రేక్కాణము కుంభప్రథమద్రేక్కాణము పక్షిద్రేక్కాణములు గనుక వీటిలో నొకద్రేక్కాణము శని దృష్టమైకాని యుక్తమైకాని యుండెనేని మెట్టయందైన పక్షిజన్మమును జెప్పవలయును. పక్షిద్రేక్కాణము చంద్రయుతమైనను దృష్టమైనను జలపక్షులజన్మమును జెప్పతగినది. ఇది యొకయోగము. బలయుక్తమైన గ్రహముతోఁగూడిన చరరాశిగాని చరనవాంశగాని శనియుతదృష్టమై యుండెనేని స్థలపక్షిజననమున్ను చంద్రయుతదృష్టమై యుండెనేని జలపక్షిజననమున్ను చెప్పవలయును. ఇది రెండవయోగము. జన్మలగ్నమందు బుధనవాంశములగు మిథునకన్యలలో నొకనవాంశము బలవద్గ్రహయుతమై యుండి శనియుతదృష్టమై యుండెనేని స్థలపక్షిజననమున్ను చంద్రయుతదృష్టమై యుండెనేని జలపక్షిజననమున్ను చెప్పవలయును.

లగ్నే జలజే బంధౌ పక్షీ స్యాద్దృక్షితేఽపివా జలజః,
స్థలజే వా తద్దృష్టే గ్రహవర్ణసమస్థలప్రభవః. 18

లగ్నము జలరాశియైనను జలగ్రహముచేఁ జూడఁబడినను జలపక్షియనియు, స్థలరాశిలగ్నమగునేని స్థలపక్షి యనియును తెలియఁదగినది.

లగ్నార్కజీవచంద్రైర్బలైశ్చైమైశ్చ మూలయోనిస్స్యాత్,
స్థలజలభవనవిభాగాః వృక్షాదీనాం ప్రభేదకరాః. 19

లగ్నము చంద్రుఁడు రవి గురుఁడు వీరలు బలహీనులై ప్రశ్న కాలమున నుండిరేని వృక్షజన్మ ప్రశ్న జేయుచున్నాఁడని తెలియతగినది. అందు స్థలజలవిభాగ మున్ను వృక్షభేదమున్ను జెప్పఁబోవుచున్నాను.

అంతస్సారాన్వృక్షాన్భానుర్దుర్గా న్కరోతి తద్భూపాన్,
క్షీరస్నేహసమేతాన్శశీ గురుః ఫలసమేతాన్. 20

కటుకంటకినో రుధిరస్సుదుర్భగా స్తరణిజ స్తథాశుక్రః,
కుసుమఫలస్నేహయుతాన్బుధశ్చ బలవర్జితం జనయేత్. 21

జన్మలగ్నమందైన నవాంశాధిపతి రవియయ్యేనేని మధ్యదృఢంబులగు శింశుపాదివృక్షంబులను పుట్టించును. చంద్రుఁడు నవాంశాధిపతి యయ్యేనేని పాలతోఁ గూడిన చెరుకు మొదలైనవానిని బుట్టించును. గురునవాంశ యయ్యేనేని సఫలవృక్షములను బుట్టించును. కుజుఁడు నవాంశాధిపుఁ డయ్యేనేని ముండ్లతోఁగూడిన చండ్ర మొదలగు వృక్షములను బుట్టించును. శని నవాంశాధిపతి యయ్యేనేని మనశ్చక్షుస్సులకు అప్రియమైన వృక్షములను బుట్టించును. శుక్రుఁడు నవాంశాధిపతి యయ్యేనేని మాలతీచామంతికాది పుష్పవృక్షములను బుట్టించును. బుధుఁడు నవాంశాధిపతియయ్యేనేని ఫలహీనములైన వృక్షములను బుట్టించునని తాత్పర్యము.

క్రూరస్సౌమ్యగృహస్థో వృక్షమనిష్టం కరోతి శుభదేశే,
సౌమ్యశ్చ పాపభవనే కుత్సితదేశే శుభం చాపి. 22

వ్యామిశ్రైశ్శుభభూమతా భవంతి మిశ్రాస్సదావృక్షాః,
స్థలజలపతయ స్తేషాం స్థలజలజానాంతు సంభవేదక్షాః. 23

లగ్ననవాంశరాశి స్థలరాశిగాని జలరాశిగాని తదధిపతియైన పాపగ్రహము తత్కాలంబున శుభగ్రహక్షేత్రమం దుండెనేని చెడ్డచెట్టు మంచి ఉద్యానాదులయందుఁ బుట్టెనని చెప్పవలయును. నవాంశాధిపతి శుభగ్రహమై పాపరాశియం దుండెనేని మనోహరమైన వృక్షము అశుభభూములగు శ్మశానాదులయందుఁ బుట్టినదానినిగా తెలియ తగినది. నవాంశాధిపతి శుభగ్రహమై శుభరాశియం దుండెనేని మంచిభూమియందు మంచిచెట్టు పుట్టినదని తెలియతగినది, నవాంశాధిపతి అశుభగ్రహమై అశుభరాశియం దుండెనేని చెడ్డభూమియందు చెడ్డచెట్టు మొలచినదని తెలియతగినది. స్థలజలాధిపత్యముల ననుసరించి సంఖ్య మొదలైనవి తెలియతగినది.

స్థలజలఖగౌ విలగ్నాద్యావతిరాశౌ తు తేఽపి తావంతః,
స్వాంశాత్పరాంశగామిషు యావత్సంఖ్యా భవంతి తావంతః. 24

స్థలజలరాశినవాంశాధిపతియైన గ్రహము లగ్నము మొదలు ఎన్నవరాశియందుం డునో తత్తుల్యసంఖ్యయని తెలియతగినది. మరియు లగ్ననవాంశాధిపతి స్వనవాంశము నుండి చలించినవాఁడై ఎన్నవదైన నవాంశయందుండునో అన్నిసంఖ్యలుగల తజ్జాతీయ ములైన వృక్షములు స్థలమందుగాని జలమందు గాని మొలచియుండునవని తెలియ తగినది.

స్వాంశే సౌమ్యైరబలైర్వియోనిలగ్నే వియోనిజాతంచ,
తద్వద్బలిభిః పాపైః స్వరాశిసంస్థైశ్చ సంయుక్తైః. 25

శుభగ్రహములు బలహీనులై లగ్నమందైనను స్వనవాంశయందైనను నుండె నేని వియోనిజన్మ గలుగును. మరియు పాపగ్రహములు బలయుక్తులై స్వక్షేత్రమందైనను స్వనవాంశయందైనను నుండెనేని వియోనిజన్మ గలుగును.

అబలగ్రహారాశిగతా అస్తంయాతాః పరాజితాభిన్నాః,
క్రూరయుతా దృష్టా వా సద్యో నిఘ్నంతి తే నిత్యము. 26

అయోగకారకులగు గ్రహములు స్త్రీగ్రహములతోడను స్త్రీరాసులయందును నుండి అస్తంగతులైనను పరాజితులైనను చెట్లు విరిగిపోవును. క్రూరయుతులైనను దృష్టిగలవారైనను పుట్టినవెంటనే చచ్చిపోవును.

ఉద్భిజ్జరాయుజానాం తథైవ సంస్వేదజాండజానాంచ,
ప్రసవం వ్యస్తసమస్తం గ్రహయోగైర్లక్షితైర్వదేత్. 27

ఉద్భిజ్జములు జరాయుజములు స్వేదజములు అండజములు అని సృష్టి చతుర్విధ ములు గలవు. గాన గ్రహయోగముల ననుసరించి దాని నిచట జెప్పవలెనని తాత్ప ర్యము.

దుర్బలగ్రహే గ్రహేంద్రా మేషో రాశిర్యదోదయం యాతి,
భానుశ్చతుష్పదగృహే చతుష్పదస్తత్ర భవతి సామాన్యే. 28

గ్రహములు బలహీనరాశియందుండి మేషరాశి లగ్నమయి సూర్యుఁడు చతుష్పద రాశియందుండెనేని చతుష్పదజంతుజననమని తెలియఁదగినది.

సామాన్యేనాభిహితో వియోనిసంజ్ఞో మయా సమాసేన,
అధునా కౌతుకజననం విశేషత స్సంప్రవక్ష్యామి. 29

సామాన్యముగ వియోనిజన్మ నాచే సంక్షేపముగఁ జెప్పఁబడెను. ఇపుడు విస్త రించి వియోనిజన్మను చెప్పఁబూనితిని.

ఇహాతు ద్వాదశభాగో రాశౌరాశౌ ప్రచోదితః పూర్వం,
జనయంతి తే వియోనిం యాంతా బలిభిశ్శశాంకరవిలగ్నే. 30

ప్రతిరాశియందుగల ప్రతిద్వాదశాంశ ననుసరించి వియోనిజన్మ ౧౪౪ విధములు గలదిగనుండును. దాని నిచట వివరించెదనని తాత్పర్యము.

మేషే శశీ తదంశే ఛాగాదిప్రసవమాహురాచార్యాః,
గోమహిషాణాం గోంశే నరరూపాణాం తృతీయేంశే. 31

ఆధానజననప్రశ్నకాలములయందు చంద్రుఁడు మేషమందైనను మేషాంశయందైనను నుండెనేని మేకలు గొఱ్ఱెలు మొదలైనవాని జననమగును. వృషభద్వాదశాంశయందుండెనేని వృషభమహిషాదిజననమున్ను మిథునాంశయందుండెనేని మనుష్యజన్మయనియుం దెలియఁదగినది.

తత్ర చతుర్థే భాగే కూర్మాదీనాం భవే దుదకజానాం,
వ్యాఘ్రాదీనాం పరతః పరతో జ్ఞేయం నరాణాం చ. 32
వణిగంశే నరరూపా వృశ్చికభాగే తథా భుజంగాద్యాః,
ఖరతురగాద్యా నవమే మృగశిఖినాం స్యాత్తథా దశమే. 33
జ్ఞేయాశ్చ తత్ర వివిధా వృక్షా స్తృణజాతయశ్చిత్రాః,
ఏకాదశే చ పురుషా జలజా నానావిధాశ్చాంత్యే. 34

కర్కాటకాంశయందు చంద్రుఁడుండెనేని కూర్మాదులజన్మమున్ను సింహాంశయందుండెనేని వ్యాఘ్రాదులజననమున్ను కన్యాంశయందుండెనేని మనుష్యజననమున్ను తులాంశయందుండెనేని నరజననమనియుం వృశ్చికాంశయందుండెనేని సర్పాదులజననమున్ను ధనుర్ద్వాదశోత్తరార్ధమందుండెనేని అశ్వగర్దభాదిజననమనియుం మకరద్వాదశాంశపూర్వార్ధమందుండెనేని మృగజననమున్ను ఉత్తరార్ధమందుండెనేని కప్పలు మొదలగు జలచరజంతువుల జననమనియుం మకరాంశయందుండెనేని వివిధములైన వృక్షములు తృణజాతులు తెలియఁదగినవి. కుంభాంశయందుండెనేని పురుషజననమనియుం మీనాంశయందుండెనేని మత్స్యాదులజననమనియుం తెలియఁదగినది. అంశయనఁగా ద్వాదశాంశయని భావము. ఈవిషయము పూర్వము ౨౧ వ శ్లోకతాత్పర్యమునందు ప్రసంగరీతిచే విస్తరించఁబడినది.

మేషే ద్వాదశభాగే జాయంతే జాతయో వివిధరూపాః,
శేషేష్వపిచైవం స్యాద్భవనేషు యథాక్రమం నియతమ్. 35

మేషరాశియందైన మేషద్వాదశాంశయందు అనేకవిధములైన జంతువులు పుట్టు చున్నవి. తక్కినరాసులయందును ఈరీతిగనే యూహింపతగినది.

యో యత్ర భవేదాద్యస్తస్యాకృతిమాదిశేత్క్రతే తత్ర,
బ్రూయాత్క్రమేణ మతిమాన్ద్వాదశభాగాత్మకే నవమే. 36

ఏరాశియొక్క ప్రథమనవాంశయందైనను ద్వాదశాంశయందైనను జననమయ్యె నేని ఆనవాంశద్వాదశాంశాధిపత్యముయొక్క ఆకృతిగల జంతువు పుట్టును.

జ్ఞేయా దేవం పుంగ్రహానవాంశైర్లగ్నగైర్ద్విపమూర్తిభ్యః,
ఆద్యాంశే యోగైరపి జాయంతే బహువిధాస్సత్వాః. 37

తాత్పర్య మతిసులభము.

శ్వప్రభృతీనాం ప్రసవే యావంతో ద్వాదశాంశకే లగ్నే,
తావంతి వదే త్ప్రాజ్ఞః పుంస్త్రీసంజ్ఞాన్యపత్యాని. 38

కుక్కలు మొదలైనవానియొక్క ప్రసవకాలమున లగ్నము దెన్ని ద్వాదశాంశలు గతములో అన్ని స్త్రీపురుషసంజ్ఞలుగల సంతానములని తెలియతగినది. నవాంశాధిపతులయొక్క స్త్రీపురుషభేదమువలనను స్త్రీసంఖ్యను పురుషసంఖ్యను దెలియతగినదని భావము.

లగ్నే జీవోఽథవా సౌరశ్చంద్రోవాఽపి స్థితోభవేత్,
కూర్మాదీనాం తథాసంఖ్యా ద్వాదశాంశేషు యావతీ. 39

లగ్నమున గురుఁడుగాని లేక శనిగాని లేక చంద్రుఁడుగాని యుండఁగా లగ్నము దెన్నిద్వాదశాంశలు గతములో అన్నికూర్మములు పుట్టునని భావము.

శుక్రో భౌమో బుధో వాఽపి చంద్రో వాఽపి శనైశ్చరః,
కుర్వంతి బలయుక్తాని భాగేష్వంగాని పూర్వవత్. 40

శుక్రుఁడుగాని కుజుఁడుగాని బుధుఁడుగాని చంద్రుఁడుగాని శనిగాని లగ్నమందుండిరేని లగ్నరాశి పూర్వోక్తప్రకార మే అవయవమగునో ఆ అవయవము బలము గలిగియుండును. కొందఱు వీరలు యేయేస్థానములయందుందురో ఆయాస్థానములకు చెప్పిన అవయవములన్నియు బలముగలిగి యుండునని తాత్పర్యము.

స్వాంశాత్పరస్యభాగే యస్మిన్కాలే గ్రహాస్సముపయాంతి,
తత్ర వికారా జ్ఞేయా లోకవిరుద్ధా ధ్రువం ప్రాజ్ఞైః. 41

గ్రహములు స్వాంశవల్లనుంచి పరనవాంశకుఁ బోవుసమయమున జంతువులకు లోకవిరుద్ధములైన వికారములు గలుగునని నిశ్చయముగఁ జెప్పఁదగినది.

వృశ్చికలగ్నే భవనే తన్నవభాగేఽథవా ద్విపదసంజ్ఞే,
బిలవాసినాం ప్రసూతి ర్ఘోరాణాం నిర్దిశే త్తత్ర. 42

గోధానాం సర్పాణాం లోపాశానాం చ శల్యకానాం చ,
మూషకబిలేశయానాం రాశిమతాం చాపి కీటానామ్. 43

వృశ్చికలగ్నమందు వృశ్చికనవాంశయైనను లేక ద్విపదనవాంశ అనఁగా: మిథున కన్యాతులధనుఃపూర్వార్ధ మకరోత్తరార్ధ కుంభరాసులయొక్క నవాంశలైనను ఉదయమగుచుండెనేని బిలవాసులగు సర్పములు వృశ్చికములు మొదలైనవాని జనన మని తెలియఁదగినది.

హయనరవిదేహలగ్నే ద్వాదశభాగే నవాంశకే వాఽపి,
పశ్యతి నరేంద్రసచివ స్తత్రోత్పత్తి ర్భవే దేషామ్. 44

లూతానాం నకులానాం వృశ్చికషడ్బిందుజాతకానాం చ,
అవిషాణాం సర్పాణాం శ్వభ్రాశ్మనివాసినాం చైవ. 45

వాజిఖరాశ్వతరాణాం గోమహిషాణాం తథోష్ట్రాణాం,
గురువర్ణకల్పరూపా న్నృపపదే స్మతిమా న్బలేనైవ. 46

ధనుర్లగ్నమందు కీటద్వాదశాంశయైనను నవాంశయైనను ఉదయమగుచుండఁగా గురుఁడు చూచెనేని సాలెపురుగులయొక్కయు ముంగిసలయొక్కయు విషములేని సర్పములు అజగరము (కొండచిలువ) మొదలైనవానియొక్కయు రాళ్లలోనుండు జంతువులయొక్కయుః గుఱ్ఱములు మొదలుగాఁగలవానియొక్కయు జననము గలుగునని తెలియఁదగినది.

మృగకటనే లగ్నస్థే తన్నవభాగే తథాఽపి సూర్యాంశే,
ఆరణ్యానాం సూతిం సత్త్వానాం నిర్దిశేత్క్రమశః. 47

నాగానాం ఖండానాం మృకశరభవరాహవానరాణాం చ,
ఋక్షోగ్రసృగాలానాం వ్యాఘ్రాదీనాం భవేత్సూతిః. 48

మకరలగ్నమందు మకరనవాంశ లేక రవినవాంశ యైనను ఉదయించుచుండెనేని ఆరణ్యములగు ఏనుఁగులు మొదలగువానిజననము అని తెలియఁదగినది.

మీనే మీనాంశేవా తజ్జే సూక్ష్మాంశకేఽపి వా లగ్నే,
గురుదృష్టే విజ్ఞేయో బహుదకోత్థ స్సదాసత్త్వః. 49

మీనలగ్నమందు మీనాంశయందైనను మీనద్వాదశాంశయందైనను గురుదృష్టి గలుగుచుండఁగా అధికజలమందుఁ బుట్టు జంతుజననమగునని తెలియఁదగినది.

మేషే మేషాంశేవా భౌమేన నిరీక్షితే సదా జావీ,
వృషభే తు వదేత్తద్వద్గోమహిషాద్యాన్సదాభృగుణా. 50

మేషలగ్నమందు మేషాంశకుజునిచేఁ జూడఁబడుచుండఁగా ఉదయమయ్యెనేని మేకలు గొఱ్ఱెలు మొదలగువాని ప్రసవము గలుగునని తెలియఁదగినది. వృషభలగ్న మందు వృషభాంశము శుక్రునిచేఁ జూడఁబడుచుండఁగా ఉదయమయ్యెనేని గోవులు గేదెలు మొదలగువాని ప్రసవము గలుగునని తెలియఁదగినది.

స్వంస్వం పూర్వవిలగ్నం సై ్వస్వై ర్వీక్షితం యదేహపతిభిస్తు,
స్వభవనసదృశాన్విద్వా న్ప్రవదే దవిశంకితం తత్ర. 51

లగ్నాధిపతి లగ్నమును జూచుచుండెనేని లగ్నరాశి సదృశమైన జంతువు బుట్టునని తెలియఁదగినది.

గ్రామ్యగృహేషు నవాంశాః పంచమునవమాష్ట రాశిసంయుక్తాః,
ఆరణ్యానాం సూతిం గ్రామేషు సునిశ్చితాం కుర్యుః. 52

గ్రామ్యరాసులగు మేష వృషభ మిథున కన్య తుల ధనుస్సు కుంభములలో నొకరాశి లగ్నమై అందు ఆలగ్ననవాంశ రాశిలగ్నము మొదలు పంచమాష్టమనవమ రాసులలో నొకటి యయ్యెనేని గ్రామములో ఆరణ్యజంతువుయొక్క ప్రసూతి గలుగునని తెలియఁదగినది.

స్థలజలరాశివిభాగా నాగరభవనేషు లగ్నసంస్థేషు,
స్థలజలచరసత్వానాం జనయంతి భవం హి విటపానామ్. 53

పూర్వోక్తములగు గ్రామ్యరాసులు లగ్నము లగుచుండఁగా ఆలగ్నములయందైన స్థలసంజ్ఞగల నవాంశలు ఉదయించుచుండఁగా మెరకప్రదేశమందు చెట్లుపుట్టు ననియు జలసంజ్ఞగలనవాంశలు ఉదయించుచుండఁగా జలప్రదేశములయందు చెట్లుపుట్టు ననియు తెలియఁదగినది.

ఉదయతి వణిగ్విలగ్నే తద్ద్రేక్కాణే సితేన సందృష్టే,
శుకశారికాన్యపుష్టా శ్చకోరభాసాశ్చ జాయంతే. 54

తులాలగ్నమందు శుక్రాధిపద్రేక్కాణము శుక్రునిచే జూడఁబడెనేని అట్టి సమయమున చిలుకలు గోరలు కోవెలలు చకోరములు అనఁగా: చక్రవాకములు మొదలైనవి పుట్టును.

సింహోదయే తథాద్యే సూక్ష్మాంశే రవినిరీక్షితే సూతిః,
కుక్కుటమయూరతిత్తిరిపారావతచంతునాదీనామ్. 55

సింహలగ్నమందు ప్రథమనవాంశగాని ప్రథమద్వాదశాంశగాని రవి జూచుచుండఁగా ఉదయమయ్యెనేని కోడి నెమలి మొదలగువాని జననము గలుగును.

స్థిరభోదయేతదంశే శేషా గ్రహాసంయుతే చ దృష్టే చ,
ప్రాసాదగృహాదీనా ముత్పత్తిః పూర్వవద్జ్ఞేయా. 56

స్థిరరాశిలగ్నము లగ్నమందలి నవాంశగూడ స్థిరరాశిసంబంధియై గ్రహయుత దృష్టముగునేని ప్రాసాదాదుల జన్మయని తెలియఁదగినది.

ఇతి త్రిపంచాశోఽధ్యాయః.

---

## అష్టకవర్గబిందుఫలములను దెలుపు ఏఁబదినాలవ యధ్యాయము.

తిర్యగ్వికోర్ధ్వమందం గిరిగిరిశపదం న్యస్య చక్రం తదూర్ధ్వం
మేషాద్యా రాశయస్స్యుర్గ్రహగణసహితా శిష్టమిష్టస్య సద్మ,
తస్యాద్యస్సోఽపి ముఖ్యం గ్రహగణముదయాంచా...ష్మా క్రమేణ
న్యస్యాథస్స్వీయచక్రే స్వపదసహితభాకాస్స్వష్టకే బిందురేఖా. 1

పూర్ణైర్బిందుభి రష్టభిః పదగతైః క్షీణోఽపి భూపో భవే
దేకైకోనతయా క్రమా త్ఫలవిధి స్సర్వేస్థి...........,
............ప్రియసుహృత్ప్రాప్తిర్విపచ్చాన్యతా
విత్తానామపి హానిరాధిక్యతా శూన్యక్రమే సంక్షయః. 2

సూర్యస్యాష్టసుబిందుషు క్షితిపతే ర్వాప్తావిభూతి ర్భవేత్
............శౌర్యవిజయ షట్సు ప్రతాపోన్నతిః,

పంచస్యార్థసమాగమ స్సదసతో స్సామ్యం చతుర్థే త్రికే
త్వధ్వశ్రాంతిరథద్వికే గదభయం దూపేఽథ శూన్యేమృతిః 3

ఇందో ర్భా విభూతి కాంచన......వస్త్రాన్న గంధోద్భవా
స్సన్మంత్రీ ద్విజసంగమోర్థ్య రమహీ......సుఖసౌఖ్యస్థితిః,
ద్వేషో బంధుజనైః ప్రియార్థవిరహో స్త్వాపద్గ స్తథా
చోర్భో ద్వేగబలా...నివసనం ప్రోక్తం ఫలానామిదమ్ 4

ఆరస్యార్థమహీసపత్నవిజయః సౌభాగ్యకాంతిప్రదాః
రాజ్ఞాం వల్లభతా ప్రసిద్ధగుణతా సామ్యం విషహ్యాం పదోః,
భ్రాతృస్త్రీవిరహో విపత్పరిభవో రాజాగ్ని పిత్తజ్వరై
స్సోఖ్యైర్దూషితమాత్రతాజఠరరుజ్యా ర్బాధీరుజ్మృత్యవః. 5

జస్యత్స్వాపతిమాన్యతా ద్రవిణతో విజ్ఞానసౌఖ్యాప్తయ
స్సర్వోద్యోగఫలోదయో నవసుహృత్ప్రాప్తి ర్నిరుద్యోగతా,
చిత్తవ్యాకులతా..............................
......................సర్వస్వహానిర్మృతిః. 6

.......... .......... .......... ......ప్తయో
వాసో వాహనహేమలబ్ధిరపి ంతధ్యాంసక్రియాసిద్ధయః,
లాభ శ్ఛేదవిహీనతా శ్రవణాద్పుష్పం స్త్వప్రణాశాదయో
భూభృతో...భయం గదైః...రశదా ద్బంధ్వర్థపుత్రక్షయః. 7

శుక్రస్యాఖిలభోగవస్త్రవనితాపుష్పాన్నపానాప్తయో,
భూపామాత్యకపుష్టయః ప్రియవధూలాభ స్సుహృత్సంగమః,
మధ్యస్థ శ్శుభపాదయో ర్జనపదగ్రామాన్నవిద్వేషతా
స్థానభ్రంశరుజః కఫశ్చవిషమే సర్వాపదాం సంగమః. 8

సౌరేర్గ్రామపురాధిపాద్యధిపతా దాసీఖరోష్ట్రాప్తయః
పూజాచోరనిషాదసైన్యపతిభి ర్ధాన్యార్థలాభాగమః,
అన్యో......లికసౌఖ్యతా సుతవధూభృత్యార్థవిధ్వంసనం
బంధోద్వేగరుజో మహాధనతయా భార్యాదిసర్వక్షయః. 9

ఇత్థం హోరాశాస్త్రం రచితం కల్యాణవర్మణా విదేనైవ,
పూర్వాచార్యైర్నిర్మిత ... ... ... దైవజ్ఞః. 10

పౌలిశరోమశవాసిష్ఠయవనబాదరాయణాశ్శక్తిః,
అత్రిశ్చ భారద్వాజో విశ్వామిత్రో గుడాగ్నికేశౌచ. 11

గర్గ..............................విస్తరం రచితం,
.........శాస్త్రేషూక్తం జాతకమితిచిత్రగుప్తకృతమ్. 12

ఈఅధ్యాయము అంతయు శ్లోకములు పూర్తిగా లేకుండుటంబట్టియు మరియొక పుస్తకము లభించకపోవుటంబట్టియు సంభవములగు బృహజ్జాతకాదిగ్రంథములయందు ఈఅధ్యాయము లేకుండుటంబట్టియు సామాన్యముగనైన సవరణ జేయుటకు వీలు లేకుండుటంబట్టియు తాత్పర్యము వ్రాయఁబడలేదు.

ఇతి కల్యాణవర్మవిరచితాయాం సారావళ్యాం
చతుఃపంచాశోఽధ్యాయః.

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1935.